# అథ సప్తమో%ధ్యాయః

## కాల మహిమ

మునయ ఊచుః |

కాలాదుత్పద్యతే సర్వం కాలాదేవ విపద్యతే | న కాలనిరపేక్షం హి క్వచిత్కించిద్ధి విద్యతే || 1

యదాస్యాంతర్గతం విశ్వం శశ్వత్సంసారమండలమ్ | సర్గసంహృతిముద్రాభ్యాం చక్రవత్పరివర్తతే || 2

బ్రహ్మ హరిశ్చ రుద్రశ్చ తథా%న్యే చ సురాసురాః | యత్కృతాం నియతిం ప్రాప్య ప్రభవో నాతివర్తితుమ్ || 3

భూతభవ్యభవిష్యాద్యైర్విభజ్య జరయన్ ప్రజాః | అతి ప్రభురితి సై#్వరం వర్తతే%తిభయంకరః || 4

క ఏష భగవాన్ కాలః కస్య వా వశవర్త్యయమ్ | క ఏవాస్య వశే న స్యాత్కథయైతద్విచక్షణ || 5

మునులు ఇట్లు పలికిరి -

సర్వము కాలము వలన పుట్టి, కాలము వలననే నశించుచున్నది. కాలసంబంధము లేనిది ఏదైననూ ఎక్కడైననూ లేదు (1). కాలము యొక్క నోటిలోపల చిక్కుకున్న బ్రహ్మాండ మండలమంతయు సృష్టి మరియు ప్రలయము అనే రెండు అవధుల మధ్యలో చక్రము వలె నిరంతరముగా తిరుగుచున్నది (2). కాలము నిర్ధారించే భాగ్యాభాగ్యములను బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మరియు ఇతరులగు దేవతలు, రాక్షసులు కూడ అతిక్రమింప సమర్థులు కారు (3). మిక్కిలి భయంకరమగు కాలము తనను తాను భూతవర్తమానభవిష్యత్తులనే మూడు ఖండములుగా విభాగము చేసి జనులను ముదుసలులను చేయుచూ సర్వాధికారములను

చేజిక్కించుకున్న పాలకుని వలె యథేచ్ఛగా ప్రవర్తిల్లుచున్నది (4). ఈ కాలభగవానుడు ఎవరు? ఈ కాలము ఎవరి వశములో నున్నది? దీనికి వశము కానివారు ఎవరు? ఓ జ్ఞానీ!ఈ విషయమును చెప్పుము (5).

వాయురువాచ |

కలాకాష్ఠానిమేషాదికలాకలితవిగ్రహమ్ | కాలాత్మేతి సమాఖ్యాతం తేజో మహేశ్వరం పరమ్ || 6

యదలంఘ్యమశేషస్య స్థావరస్య చరస్య చ | నియోగరూపమీశస్య బలం విశ్వనియామకమ్ || 7

తస్యాంశాంశమయీ శక్తిః కాలాత్మని మహాత్మని | తతో నిష్క్రమ్య సంక్రాంతా విసృష్టాగ్నిరివాయసీ || 8

తస్మాత్కాల వశే విశ్వం నస విశ్వవశే స్థితః | శివస్య తు వశే కాలో న కాలస్య వశే శివః || 9

యతో%ప్రతిహతం శార్వం తేజః కాలే ప్రతిష్ఠితమ్ | మహతీ తేన కాలస్య మర్యాదా హి దురత్యయా || 10

కాలం ప్రజ్ఞావిశేషేణ కో%తివర్తితుమర్హతి | కాలేన తు కృతం కర్మన కశ్చిదతివర్తతే || 11

ఏకచ్ఛత్రాం మహీం కృత్స్నాం యే పరాక్రమ్య శాసతి | తే%పి నైవాతివర్తంతే కాలం వేలామివాబ్ధయః || 12

యే నిగృహ్యేంద్రియగ్రామం జయంతి సకలం జగత్ | న జయంత్యపి తే కాలం కాలో జయతి తానపి || 13

ఆయుర్వేదవిదో వైద్యాస్త్వ నుష్ఠితరసాయనాః | న మృత్యుమతివర్తంతే కాలో హి దురతిక్రమః || 14

శ్రియా రూపేణ శీలేన బలేన చ కులేన చ | అన్యచ్చింతయతే జంతుః కాలో %న్యత్కురుతే బలాత్ || 15

వాయువు ఇట్లు పలికెను -

మహేశ్వరుని సర్వోత్కృష్టమగు తేజస్సు కళ, కాష్ఠ, నిమేషము మొదలైన కాలావయవములతో రాజిల్లునదియై కాలాత్మ అని పిలువబడుచున్నది (6). ఈశ్వరుని బలము అనదగిన కాలము సమస్తమైన చరాచరజగత్తు ఉల్లంఘించ శక్యము కాని ఈశ్వరుడు అధ్యాదేశము వంటిది. కాలమే జగత్తును నియంత్రించుచున్నది (7). ఆ పరమేశ్వరుని శక్తి యొక్క అంశములోని అంశము నిప్పులను గ్రక్కే ఇనుప ముక్క వలె ఆయననుండి బయటకు వచ్చి గొప్పది యగు కాలపురుషరూపముగా సంక్రమించినది (8). కావున, జగత్తు కాలమున అధీనమై యున్నది. కాలము జగత్తునకు వశములో లేదు. కాని, కాలము శివుని వశములో నున్నది. శివుడు కాలమునకు వశములో లేడు (9). ప్రతిఘటింప శక్యము కాని శివుని తేజస్సు కాలము నందు ప్రతిష్ఠితమై యున్నది. కావున కాలముయొక్క పరిధి చాల గొప్పది మరియు అతిక్రమించ శక్యము కానిది (10). ఏ మానవుడు తన బుద్ధియొక్క మహిమచే కాలమునతిక్రమించ గలడు? కాలముచే సంక్రమింప జేయబడిన కర్మఫలమును ఎవ్వరైననూ తప్పించుకొనలేరు (11). ఎవరైతే పరాక్రమించి భూమినంతనూ ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించెదరో, వారైననూ సముద్రములు చెలియలికట్టను వలె కాలమును అతిక్రమించలేరు (12). ఎవరైతే ఇంద్రియసమూహమును నిగ్రహించి సకలజగత్తును జయించెదరో, వారైననూ కలమును జయించలేరు. కాలమే వారిని జయించును (13). ఆయుర్వేదవిద్వాంసులగు వైద్యులు రసాయనములను తయారు చేసెదరు. కాని వారు మృత్యువును అతిక్రమించలేరు. కాలము ఎవ్వరికైననూ అతిక్రమింప శక్యము కానిది (14). సంపద, సౌందర్యము, శీలము, బలము, కులము అను వాటిని ఆధారముగా చేసుకొని మానవుడు ఒకటి తలపెట్టగా, కాలము బలాత్కారముగా మరియొక దానిని చేసిపెట్టును (15).

అప్రియైశ్చ ప్రియైశ్చైవ హ్యచింతితసమాగమైః | సంయోజయతి భూతాని వియోజయతి చేశ్వరః || 16

యదైవ దుఃఖితః కశ్చిత్తదైవ సుఖితః పరః | దుర్విజ్ఞేయస్వభావస్య కాలస్యాహో విచిత్రతా || 17

యో యువా స భ##వేద్వృద్ధో యో బలీయాన్ స దుర్బలః | యః శ్రీమాన్ సో % పి నిఃశ్రీకః కాలశ్చిత్రగతిర్ద్విజాః || 18

నాభిజాత్యం న వై శీలం న బలం న చ నైపుణమ్ |
భ##వేత్కార్యాయ పర్యాప్తం కాలశ్చ హ్యనిరోధకః || 19

యే సనాథాశ్చ దాతారో గీతవాద్యైరుపస్థితాః | యే చానాథాః పరాన్నాదాః కాలస్తేషు సమక్రియః || 20

ఫలంత్యకాలేన రసాయనాని సమ్యక్ప్రయుక్తాన్యపి చౌషధాని |

తాన్యేవ కాలేన సమాహృతాని సిద్ధిం ప్రయాంత్యాశు సుఖం దిశంతి || 21

నాకాలతో%యం మ్రియతే జాయతే వా నాకాలతః పుష్టిమగ్ర్యాముపైతి |

నాకాలతస్సుఖితం దుఃఖితం వా నాకాలికం వస్తు సమస్తి కించిత్ || 22

కాలేన శీతః ప్రతివాతి వాతః కాలేన వృష్టిర్జలదానుపైతి | కాలేన చోష్మా ప్రశమం ప్రయాతి కాలేన సర్వం సఫలత్వమేతి || 23

కాలశ్చ సర్వస్య భవస్య హేతుః కాలేన సస్యాని భవంతి నిత్యమ్ |

కాలేన సస్యాని లయం ప్రయాంతి కాలేన సంజీవతి జీవలోకః || 24

ఇత్థం కాలాత్మనస్తత్త్వం యో విజానాతి తత్త్వతః |
కాలాత్మానమతిక్రమ్య కాలాతీతం స పశ్యతి || 25

న యస్య కాలో న చ బంధముక్తీ న యః పుమాన్న ప్రకృతిర్న విశ్వమ్ |

విచిత్రరూపాయ శివాయ తస్మై#్మై నమః పరస్మై#్మై పరమేశ్వరాయ || 26

ఇతి శ్రీశివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వభాగే కాలమహిమ వర్ణనం నామ సప్తమో%ధ్యాయః (7).

పరమేశ్వరుడు ప్రాణులకు ప్రియములు మరియు ప్రియములు కానివి అగు వస్తువులతో , లేదా వ్యక్తులతో అనుకోకుండగా సమాగమముగు కలిగించి, మరల వియోగమును కలిగించుచున్నాడు (16). ఏకాలములో ఒకడు దుఃఖించుచున్నాడో, అదే కాలములో మరియొకడు సుఖించుచున్నాడు. అహో! తెలియ శక్యము కాని స్వభావము గల కాలము ఎంత విచిత్రమైనదియో! (17) యువకుడు ముదుసలి యగుచున్నాడు. బలవంతుడు దుర్బలుడగుచున్నాడు. ధనవంతుడు దరిద్రుడగుచున్నాడు. ఓ బ్రాహ్మణులారా! కాలము యొక్క తీరుతెన్నులు చిత్రమైనవి (18). ఒక వ్యక్తి పుట్టిన వంశముయొక్క మహిమ గాని, శీలము, బలము నైపుణ్యము అనునవి గాని, ఒక కార్యమును సాధించుటకు చాలవు. కాలమును ఆపగలవారు లేరు (19). తమకు రక్షకులు ఉండి దాతలు అయినవారు, సంగీతము వాద్యములు మొదలగు వాటితో తులదూగువారు, అనాథులు, బిచ్చమెత్తుకుని బ్రతుకువారు, వీరందరియందు కాలము సమానమగు ప్రవృత్తిని చూపుచున్నది (20). శాస్త్రీయముగా తయారు కాబడిన ఎంత చక్కని మందులు అయిననూ, కాలము పరిపక్వము కానిదే పని చేయవు. కాని, కాలము కలిసి వచ్చినప్పుడు అవే మందులను వాడినచో వెంటనే ఆరోగ్యము సిద్ధించి సుఖము లభించును (21). మానవుడు కాలము రాకుండగా మరణించడు; పుట్టడు; మరియు, కాలము రానిదే, కొనియాడదగిన పుష్టిని పొందడు. కాలము రాకుండగా సుఖము గాని, దుఃఖము గాని సంప్రాప్తము కావు. సమస్తజగత్తులో కాలము పరిపక్వము కానిదే ఏ

వస్తువు అయిననూ లభించదు (22). కాలమును బట్టి చలిగాలులు వీచును. కాలమును బట్టి మేఘములలోనికి నీరు వచ్చును. కాలము వచ్చినప్పుడు వేడి తగ్గును. కాలము వచ్చినప్పుడు సర్వము సఫలమగును (23). పుట్టుకలన్నింటికీ కాలమే కారణము. కాలము వచ్చినప్పుడు మాత్రమే ప్రతి సంవత్సరము పంటలు పండును. కాలము వచ్చినప్పుడు పంటలు చెడిపోవును. ఈ ప్రాణిసముదాయము తమ తమ ఆయుఃకాలములో చక్కగా జీవించును (24). కాలపురుషుని తత్త్వమును ఈ విధముగా యథార్థముగా ఎవడు తెలుసుకొనునో, ఆతడు ఈశ్వరుని కాలస్వరూపమునతిక్రమించి, కాలాతీతుడగు ఈశ్వరుని దర్శించును (25). ఎవనికి కాలము గాని, బంధము గాని, మోక్షము గాని లేవో, ఎవడు పురుషుడు గాని, ప్రకృతి గాని, జగత్తు గాని కాదో, అట్టి విచిత్రమగు స్వరూపము గలవాడు, మంగళకరుడు, సర్వాతీతుడు అగు పరమేశ్వరుని కొరకు నమస్కారము (26).

శ్రీ శివమహాపురాణములోని వాయువీయసంహితయందు పూర్వభాగములో కాలమహిమను వర్ణించే ఏడవ అధ్యాయము ముగిసినది (7).